నాల్గవ ముద్రణము 1958



# ఆకాంక్ష

జగతి సుభిక్షమై పరమశాంతి ప్రపంచపు లక్ష్యసిద్ధియై
యగణిత సత్యసంధత మహాఘన లౌకిక రాజనీతియై
పగతుర గెల్చు సాధన శుభంకరమైన యహింస శస్త్రమై
నెగడి ప్రపంచకంబు కడు నీతిమెయిన్ విలసిల్లు గావుతన్.

చ॥ అకలుష శీలతన్ ప్రజ మహాసుఖ సంపద నోలలాడుతన్
సుకవుల లేఖినిన్ వెలసి శోభిలుం గావుత భారతాంబయున్
సకల కళాప్రపూర్ణయయి శాశ్వత శాంతిని గాంచి వెల్గుతన్
ప్రకటిత విక్రమస్ఫురణ భవ్యయశంబును గాంచి మించుతన్.

| పేజి | పంక్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| ౧౬ | 8 | నిఖల | నిఖిల |
| ,, | 20 | శ్వర్వ | శ్వర్య |
| ౩౩ | 20 | ఆమర | అమర |

శ్రీరామా పవర్ ప్రెస్, గుంటూరు–1.

# పరిచయము

ఈ కవిసోదరులను ఎన్నాళ్ళనుండో నే నెరుంగుదు. ప్రేమకు, విశ్వాసానికి, నిరహంకారానికి నిష్కల్మష దేశాభిమానానికి వీరినే పేర్కొనదగునాయని యనిపించును. ఇద్దరు బుద్ధిజీవులే. పైగా కవీశ్వరులు. రచయితలు. అనవరతము ప్రజాశ్రేయోభిలాషులగుటయేగాక, దీనజనుల నుద్ధరించుటకై తమ దివ్యలేఖినికి పదను కల్పించుకొనుచున్న ఆదర్శ సంఘసేవా సైనికులు.

ఇందొకసారి జైలునకుపోయి వచ్చినారు కూడా గాంధిజీ ఆశయ సాధనకై. ఆయన నివసించు స్థానానికి తలవనితలంపుగా నేను వెళ్ళుట తటస్థించినది చిలకలూరిపేటలో జరుపబడుచున్న ఆంధ్రరాష్ట్ర కాంగ్రెసు రాజకీయకళాశాలా ప్రారంభోత్సవమునాడు (14–9–48). అదియొకవిద్యార్థి వసతిగృహము. అందొకగదిలో కిరసనాయిలుడబ్బా తళతళలాడుచుండెను. అదొక స్టోర్ రూమ్ ఏమోననుకొనుచుంటి. ఇంతలో పుస్తకాలవరుసలు, పత్రికగుట్టలు, యోగాభ్యాసము కొఱకై పఱువబడిన చాపాయనే చిన్నినేల కంటుకొనియున్న ఆసనము కన్పడినవి. ఇంతలో నెవ్వరో నా వెనుకనుండి యిది నరసయ్యగారి బస యని యనిరి. వెన్వెంటనే ఆచార్య సర్. పి.సి. రే, నా మనస్సునకు వచ్చిరి. వారును యీలాగున ఆదర్శక్షు ప్తజీవనులైన ఉపాధ్యాయులు. విద్యార్థుల ప్రేమించి విజ్ఞానాన్ని వికసింపజేయుచుండిన, ధనదేవత నపహసించిన యోగి, ఆయన అంతటి ఉన్నతపదవులందుండి అట్టి ఆశయ

ముల ప్రచార మొనర్చితే; వీరిట్టి చిన్ని ఆచార్యపదవియందే యింతటి ఉన్నత జీవితము సాగించుచున్నారు గదా! యని యనుకొంటి. ఆనందమొందితి.

రెండవ వారో ఆనంద దేవత కళలన్నిటిని తన సొత్తొన ర్చుకొన్న బుద్ధిజీవులు. ప్రియపాత్రులు. స్నేహపథ మన్న నెదియో యెరింగిన ఉత్తమ పండితులు.

వీరిద్దరుచేరి ఈనాటి ఉపాధ్యాయులై ఆనాటి ఆచార్యు లంబలె, వర్తించుకొనుచు సంఘసేవ చేయుచున్నారు. అనవర తము ప్రతిఫలాకాంక్ష యీనాటికి రీతినబొందకనే. అందులకే నాకు వీరన్న అంత అభిమానము.

వీ రొనర్చుచున్న సేవావ్రత మెంతో ఉత్తమమైనది. కైతకుగాదు వీరుసింగార మొనర్చునది, సింగార మెరింగిన తమ కైతను బీదలకై వారి బిడ్డల శుభమునకై దేశమునకై ఆమె సేవకులకై శ్రామికులకొరకై వారిని రక్షించు సాధారణప్రజ లకై వినియోగించుచున్నారు.

సులభమైన శైలి, నోటికిబట్టె మాటలు, ఆచరణయం దున్న పద్యధోరణి, ప్రజానుభవముల ననుసరించు ఉపమాన ములు.

శ్రామికులను ఉన్నతవీథిని నడపించి లాలించి, అభి మానించి క్రమక్రమానుగతముగా దేశీయ, ఆర్థిక, రాజకీయ నైతిక ఆశయాలపై ప్రేమగల్గించు భావవీచికల ద్వారా మనవారినందరిని వీరు ప్రబోధించుచున్నారు. తామో దేశ

భక్తులు. వినయావతార ప్రతిబింబాలు. ద్వేషాసూయల నెరుంగని మార్కండేయ సదృశ దేశభక్తులు. అటులనే మన విద్యార్థులను తయారుచేసికోవాలని ఆకాంక్షించే రచయితలు.

మూడువత్సరాలనాడు వీరిపుస్తకాన్ని కాంగ్రెసు విజయాన్ని చదివితి. మధ్యమధ్య ప్రజారాజ్యమును జూచితిని. ఈమధ్యనె "జయభేరి" ని చదివినాను. మెట్టు మెట్టునకు బిడ్డల నెంతప్రేమతో దేశసేవావ్రతమందు పైకితీసికొని వెళ్ళుచున్నారు! దానితో తృప్తిచెందక దసరావేళలందు బిడ్డల హృదయాలు ఆనందమయములై యున్న సమయాన, తల్లిదండ్రులు తమబిడ్డలను జూచుకొని, వారి చిలుకపలుకులువిని ముచ్చటబడు సమయానగూడ, గాంధీమహాత్ముని బోసుపీరుని దివ్యబోధ ప్రచారితమొనర్ప "దసరాగీతములు" తయారుచేసిరి.

వీరు చేస్తున్న పనంతా, జాతీయవిజ్ఞాన ప్రచారమందొకఉత్తమభాగముగా నెంచుకొనప్రజలకందరకు నా మనవి.

ఈకాలపు ప్రజాప్రబోధపు మెట్టులందు శ్రీసీతారామమూర్తి తన "రాష్ట్రగానము"ద్వారా, ఏటుకూరి "జాతీయవిజ్ఞానము" వలన, జాషువా తన "పద్యగుచ్ఛముల"చే,గొట్టిపాటి "రైతాంగరచనల"ద్వారా, చేయు సేవనే ప్రియపాత్రముగా ఈ యువజనమిత్రులు తమ రచనలచే చేయుచున్నారు. వీరికి నా జోహారులు.

**29-9-48.** **—ఆచార్య యన్. జి. రంగ.**

# విషయసూచిక

# సోదరా!

శ్రీలకెల్లను పుట్టినిల్లయి - శీలసంపద కాస్పదంబయి
మేలొసంగెడి తెనుగు సీమను - మేలుకొల్పుము సోదరా.

మూఁడుకోటుల తెలుఁగుబిడ్డలు - మోదమలరగ సంచరించుచు
వాడి మగటిమిఁ జూపి తిరుగగ - వాదమేలర సోదరా.

పాడిపంటల కొదువలేదా - పైరు పచ్చల తరుగు లేదా
పైడిపంటలె పండు నెలవులు - బాగుగాగను సోదరా.

కృష్ణ గోదావరి పినాకిని - తృష్ణదీరగ నమృత మొసగుచు
ఉష్ణతాపము వాప నాంధ్రులు - జిష్ణు లైరిర సోదరా.

తుంగభద్రానదీ జలము - తుంగమై యాకసమునంటు త
రంగపంక్తుల తెనుగు నేలను - రంగుమీరెర సోదరా.

తూర్పునను రత్నాకరేంద్రుడు - ధూర్తులకు గంభీరుడై కడు
నేర్పుమీరగ తెనుగుతల్లిని - నెనరునను గను సోదరా.

విజయనగరం బుత్తరంబున - విజయనగరము దక్షిణంబున
విజయవాటిక మధ్యఁ గల భువి - విజయరాష్ట్రము సోదరా.

ఒక్కదిశ మన కరవ సోదరు - లొక్కచెన కన్నడ భ్రాతలు
నొక్కవైపున ఓఢ్రబంధులు -చక్కగా గను సోదరా.

ఇరుగు పొరుగు సహోదరాళిని - నెసక మెసగగ మైత్రితోడుత
కరము ప్రేమనుగాంచి రాష్ట్రపు - గౌరవము గను సోదరా.

తెలుగువీరుల శక్తి చిహ్నము - తెలుపుచున్నది విజయనగరము
తెలుగు కవులను రాణ్మహేంద్రమె - తెలుపుచున్నది సోదరా,

తిరుపతియు శ్రీశైలతీర్థము - స్థిరముగను భద్రాద్రిక్షేత్రం
బరయగను మన తెనుగుసీమను - అలరుచుండెర సోదరా.

శిల్పకళలకు తెలుగుగడ్డయె - శ్రేష్ఠమైనది భారతావని
అల్పమే యది దేశదేశా - లాక్రమించెర సోదరా.

ఎల్లొరా అజంత గుహలలో - ఎంతొపనితన మలరియున్నది
మెల్లగా నీవడిగి కనుగొని - మేలునొందుము సోదరా.

హంపియందున రాజసభలో - కంపమొందిన స్తంభరాజము
సొంపుగను సప్తస్వరమ్ముల - నింపుగూర్చును సోదరా.

దాక్షిణాత్యుల గానపటిమకు - దారినొసగిన త్యాగరాయలు
సాక్షిరా మన తెనుగుగానపు - శక్తి తెలుపగ సోదరా.

కవితలో గానంబులోపల - ప్రవిమలంబగు భక్తిసంపద
వివిధకళల ప్రశస్తిగాంచిన - దవుర! మన భువి సోదరా,

దేశభాషామండలములో - తెలుగు లెస్సని మెప్పు వడసెను
దేశభాష తెనుంగుసీమను - తీర్చిదిద్దర సోదరా.

ఆంధ్రరాష్ట్రమునంది రాజ్యము – ఆంధ్రముననే నడుపుకొనరా
ఆంధ్రమే నీ కోర్టుభాషగ - అదరింపర సోదరా.

తెలుగువారలు కష్టసుఖములు – తెలుగులో అధికారులకును
తెలుపగలుగ స్వరాజ్య మదియగు - తెలిసికొనరా సోదరా.

ఆంధ్రమంత్రులు ఆంధ్రనాయకు - లాంధ్రులెల్లను సర్వశుభముల
ఆంధ్రరాష్ట్రమునందు వెలయుత – అధిక జయముల సోదరా.

# గ్రంథాలయము

శ్రీలక్ష్మి విలసితమై
భూలోకము స్వర్గతుల్యమును నొనరింపం
జాలెడి యాలయ మొక గ్రం
థాలయమే భువి వెలయు ప్రధానం బగుచున్.

అజ్ఞాన తిమిరమ్ము నణఁగించు రోచిష్ను
విజ్ఞానచంద్రికల్ వెలయు విధువు
చిత్తవిస్ఫురణంబు సేసెడి బోధంబు
మానసికానంద మధురమధువు;
అలసత్వమును ద్రోల ననువైన ములుకోల
కార్యశూరులఁ జేయు కర్మభూమి
ఇహపర సమ్మోదావహమైన సుపథమ్ము
మనుజ సంతతికి సన్మార్గదర్శి
సరస సహకార సౌహార్ద్ర సత్య శీల
సాధుసంగత సద్గుణస్థైర్య సరళ
సత్ప్రథానుగాములుగను సల్పఁగలుగు
నాలయ మ్మొక గ్రంథాలయమ్ము సుమ్ము.

# నవభారతము

బంజరులను నూత్న పరికరంబులచేత
మంచిపొలాలుగా మార్పవలయు
ఆనకట్టలుగట్టి అన్ని నదులనీరు
పంటభూములలోన పాఱవలయు
నవ్యవస్తూత్పత్తి నాఢ్యంబుగాఁ జేయ
పెద్ద పరిశ్రమల్ పెరుగవలయు
విద్యుత్తుచే నుర్వి వివిధోపయోగముల్
పొందునట్లుగ వేగఁ బూనవలయు
గనుల శోధించి లాభముల్ గాంచవలయు
విద్య, నాటకాల్ సినిమాలు వెలయవలయు
కష్టజీవుల రాజ్యంబె కలుగవలయు
బద్ధకంబెల్ల మాయమై పోయవలయు.

అన్నము వస్త్రమున్ గృహము నందఱకుం దగ వైద్యవిద్యలున్
బన్నములెల్ల బాయుటకు పౌరుల హక్కులు నర్థసామ్య సం
పన్నమునైన ఐక్యమును బాగుగ నేర్పడి విశ్వమంతటన్
క్రన్నన సర్వ సౌఖ్యములు కల్గగ యత్నము సేయుడిప్పుడే.

లెమ్మా భారతయువకుడ
కొమ్మా శపథంబు ప్రజలకోర్కెలు పండన్
తెమ్మా ఆర్థిక సమతను
ఇమ్మా జీవంబు విద్య లింపుగ ప్రజకై.

వసనము లేదు కట్టుటకు, వానల యెండల నోర్చి నిల్వగా
పసగల ఇల్లు సున్న, మఱి వైద్యముమాట వచింప నేటికిన్
మెసవుటకింత తిండియును, మేధకు విద్యయు లేవు బీదకున్
అసువులు నిల్పి వానికయి అత్యధికంబుగ సేవ సల్పుమా.

గ్రామ గ్రామమునకు ఘనమైన రోడ్లును
రేడియో యంత్రాల పాడుటయును
ఇంటింటికిని మంచి ఎలక్ట్రిదీపాలు
పనిముట్లు క్రొత్తవి పరమకృషికి
గ్రామసంశుద్ధియు గ్రామ పరిశ్రమల్
విజ్ఞాన నిలయాలు విమల సభలు
రాష్ట్రసంసేవయు రాజకీయప్రహాక్కు
జాతిప్రణాళికల్ సామ్యవాదము
భవ్య బాధ్యత దేశీయపాలనమున
కలుగునట్లుగ యత్నంబు సలుపుటకును
నడుము బిగియించి వేగమే నడువుడయ్య
వేడి రక్తంబు గలిగిన వీరులార.



# పతాకము

ఈ పతాకచ్ఛాయనే గాంధిజీ సత్యా
    తత్వంబు వర్ధిల్లి తనరుచుండె
ఈ పతాకచ్ఛాయనే వీరజవ్హారు
    స్వాతంత్ర్య సమరంబు సలుపుచుండె
ఈ పతాకచ్ఛాయనే అజాద్ మౌల్వి జా
    తీయ ముస్లిముల బోధించుచుండె
ఈ పతాకచ్ఛాయనే జైప్రకాశుండు
    సామ్యవాదము నిల్పి సాగుచుండె
ఈపతాకముఛాయలనే సుబాసు
నడిపి జాతీయసేనల నవ్యఫణితి
నాంగ్ల సామ్రాజ్యబలముల నదరజేసె
ఇట్టి యీ త్రివర్ణపతాక నెన్నఁదరమె!

ప్రాణపదంబుగా ధ్వజము రక్షణఁ జేసికొనంగలేక ని
ద్రాణతజెందు జాతులకుత్రాణయెటుల్ గలుగున్దలంపఁగా
క్షీణతనొందు సంపదలు; క్షేమములేకడుదూరమౌను; వి
న్నాణము పెల్లుబెక్కు యమునాకమెయంటఁగ నెత్తియుంచుఁడీ!

స్వేచ్ఛను బొందు జాతి కొక చిహ్నముగా నొక వైజయంతియౌ
స్వచ్ఛము, లోహితచ్ఛవియు, శ్యామరుచిన్ వెలుగొంది కేంద్రమం
దచ్ఛపు శాంతిలక్ష్యమగునట్టి యశోకమహోర్వి నాథుకీ
ర్తిచ్ఛవి వెల్గు చక్రము ధరించినదే భరతోర్వికేతువౌ.

ఎఱుపురంగు నెపుడు నెగుర వేయుముపైని
క్రింద తెలుపు పచ్చ పొందువరుస;
తలను క్రిందు జేయఁదగ దెన్నడును దాని
వలన దేశ గౌరవంబు తఱుగు.

మూడురంగుల జెండ ముచ్చటైన జెండ
భారత స్వాతంత్ర్య ప్రతిబింబ మీ జెండ
ఆకాశవీథిలో ఎగురవేయండీ!
ఔన్నత్యమును జాతి కందజేయండీ! మూ

జాతి, మత, కుల, వర్గ సామరస్యముతోడ
భారతైక్యముగూర్చి పరగుచుండెడి జెండ
ఆకాశవీథిలో నాడనీయండీ!
స్వాతంత్ర్యపథములో సాగి నడువండీ!



# భారతాంబ

రతనాలగని పాతరను బెట్టికొనియున్న
రత్నగర్భా! నీకు ప్రణతిసేతు
సకల సస్యాళి కాస్పదమౌచు వెలసిన
పంటవలతి! నీకు వందనంబు
అఖిల గోగణసమాజా భ్యున్నతిని గూర్చు
సురభిమాతా! నీకు జోతసేతు
నిఖిల విద్యాలయందు నేర్పును జూపించు
భారతీమాతరో! బహుళనతులు
వెలసి ముక్కారుపంటల వేడ్క నలరి
జగతి ధనధాన్యరాసుల సాటి మిగిలి
బలసి నవరత్న సంచయ భాగ్యగరిమ
తనరుచుండెడి యమ్మ! వందనముగొమ్మ!

సగర హరిశ్చంద్ర సమ్రాట్టుల భుజాగ్ర
పీఠియందున ఎఱ్ఱవీగినావు
భరతమహారాజ బాహుపీఠిక నెక్కి
స్వాఃఖండ సదృశవై వరలినావు
శ్రీరామజనపాలు స్థిరకీర్తి చంద్రికా
కాంతిపుంజమునందుఁ గ్రాలినావు
అల పరీక్షిన్నృపా లైశ్వర్యసంజని
తాధ్యాత్మ కళఁదృప్తినందినావు

మహిత రాజన్య మస్తక మకుట రత్న
దివ్యరోచిస్సుధాధార తీర్థమాడి
తరతరాలకు తరుగని ధన్యకీర్తి
పరిఢవిల్లితి వమ్మరో! భరతమాత!

జీవహింసకు స్వస్తి చెప్పినట్టి యశోకు
శిశువుగాఁ గన్న దాక్షిణ్యరాశి
సాహసంబున కొక్కస్థాన మిప్పించిన
విక్రమార్కుని గన్న వీరవనిత
ఆర్థికనీతికే అంకురార్పణఁజేయు
కౌటిల్యు కడుపునఁ గన్నతల్లి
రాజతంత్రాబ్ధి పారంబు గాంచినయట్టి
ఆ యుగంధరు గన్న గేయచరిత

విశ్వవిఖ్యాతులై ధర్మవీరు లయిన
పుత్రులను గాంచి మించిన పూతశీల
భరతమాతకు సాటి ప్రపంచకమున
భరతమాతయె! జోహారు భారతాంబ!

సత్యము శాంతము భక్తియు
నత్యంత ముదంబు ప్రేమ యమల గుణంబుల్
నిత్యము మాకు నొసంగుచు
స్తుత్యంబుగ భారతాంబ ! చూడుము మమ్మున్.

శీర్షమా? ఉత్తుంగ శిఖరపంక్తుల నొప్పు
భువనేశ్వరీదేవి పుట్టినిల్లు
పాదమా? రఘువీరపాదాశ్రయప్రాప్త
రాజ్యవిభీషణు రాజధాని
బాహులా? విస్తారభారధౌరేయ స
న్మౌనీంద్ర విలసిత నాగపంక్తి
వక్షమా? సకలసంపత్కారోదంచిత
ధనధాన్యరాశి మైదానభూమి

కటియొ? వింధ్యాద్రి నర్మదా తటిచయంబు
నడులొ? రమ్యగంగా సింధు సారధునులు
రూపొ? నవ్యలావణ్య చిద్రూప బింబ
మహహ ! భారతలక్ష్మి ! జోహారు తల్లి !

విమల యశోవిరాజితుల వీరవరేణ్యులఁ గన్న యమ్మ ! నీ
చముగ విదేశపాలకుల చక్కని దాస్యముచేఁ గృశించి కా
లమునకు వేచియుంటివి స్వరాజ్య మటంచు నెదం దపించుచున్
సమయము దీరె, గాంధి జయశంఖము నొత్తెను తల్లి ! సేవకై.

జీవకోటులకెల్ల జీవనాధారమౌ
నవధాన్యములకుఁ గాణాచి గాగ
సభ్యతాజగతిలో సాటిమీఱి వెలుంగు
ఖనిజసంపత్తి కాకరము గాగ
ఆయురారోగ్య సంశ్రేయంబు లొసగెడి
ఓషధీచయమున కునికి గాగ
బలవర్ధకమ్ములౌ పాల్మీగడల నిడు
పశుగణంబునకు నాస్పదము గాగ

సకల శుభలక్షణములఁ బ్రశస్తిగాంచి
భవ్యసంపద దులతూఁగు భరతమాత
కూడుగుడ్డలకునుగూడ గోడుజెంది
దేవురించఁగవలసె విదేశజులను.

ఉన్న దఖండభూమి జన మున్నది నల్వది నాల్గు కోటులే
మున్నను కూడుగుడ్డలకయో ! యని కుందుచునుంటెగాని వే
రున్నదె? దిక్కులేక పడియుండిన దీనుల నుద్ధరించు వా
రున్నగదా ! సముజ్జ్వలమహోన్నతిగాంచుట దేశమక్కటా.



# గాంధీమహాత్ముఁడు

కలవొ లేవో యనంగను నాలుగు పరక
 లాడుచుండెడి వట్టి బోడినెత్తి
ఒలుకునేమొ ముత్యములు, మాటలాడనం
 చానబెట్టెడియట్టి బోసినోరు
కండరంబులు మేన గలవు లేవన నొప్పి
 చిక్కియుండిన యట్టి బక్కమేను
ఔర ! దరిద్రనారాయణాఖ్యుఁ జెలంగ
 మోకాలిపై కున్న ముతుకబట్ట

ఒకట సత్య మహింస వేఱొకట వెలయ
రెంట సమదృష్టిగల వాఁడవంట కేమొ
కనుల నొప్పారు చక్కని కళ్ళజోడు
దివ్యమోహనరూప ! గాంధీమహాత్మ !

హరిజనసేవకే తనువు నర్పణఁజేసిన మేటిదాత; దు
ర్భరమగునట్టి లేమిడిని పాపగఁ బూనిన మేటిత్రాత; ఇ
ద్ధరణి అహింససాధనవిధానము నేర్పిన మేటినేత; పా
మరజన కల్పభూరుహము; మాన్యుఁడుగాంధి మనుష్యమాత్రుఁడే!

బహునీచముగఁ జూడఁబడు దక్షిణాఫ్రికా
భారతీయుల యార్తిఁ బాపి వచ్చె
యజమానులకుఁ జిక్కి అల్లాడు బీహారు
తోఁటవారల గోడు తొలఁగఁజేసె
పన్నుకై బాధింపఁబడుచున్న గుజరాతు
రైతులకొఱకు పోరాడి గెలిచె
వేతనాలను బెంచవేఁడు 'అహ్మదబాదు'
మిల్లుకూలీకోర్కెఁ జెల్లఁజేసె

తలప సత్యాగ్రహాస్త్రంబు తగ ధరించి
మొనసి 'రౌలటుశాసనాల్' మూలఁద్రోసె;
భరతభూమిని ధర్మంబుఁ బాదుకొలుప
ప్రభవ మందెను గాంధి వేపలుకులేల?

అనుపమ శాంతి శీలము, దయార్ద్రరసైకమనః ప్రవృత్తి, దుర్జన హృదయాంతరాళముల సాత్వికబోధ ఘటించు సాధనమ్ము, నళినపత్రమందు జలముం బలెనంటియు నంటకుండగా జనపదవీధి గ్రుమ్మరువిశాల సమైక్యము గాంధి సాజముల్.

పశ్చిమోత్తరరాష్ట్రభారంబు దాల్చిన
అబ్దుల్ గఫూరు నీ యండనుండె
బంగాళమెల్ల నీ పాదాలకడ నిడ
బోసువీరుండు నీ పొంతనుండె
బీహారమెల్ల నిర్భీతి నీ కర్పింప
రాజేంద్రబాబు నీ ప్రక్క నుండె
గుజరాతు నొక్క చోఁగూర్చి నీ దెస నుంచ
ఘనుడు పటేలు నీ కడనె యుండె

ఆంధ్రభువి నిడ రంగాజి యలరియుండె
తమిళమునుగూర్చ రాజాజి దండ నుండె
స్త్రీలనడుప సరోజినీదేవి యుండె
ఏమి నీ కింక కొఱత గాంధిమహాత్మ !



పోయెనె యక్కటా మనప్రభుండు మహాత్ముడు దీనబాంధవుం
డీయెడ దిక్కుమాలిన మహీప్రజ నిక్కడవీడి యొక్కడే
కాయముబాసి; యెవ్వఁడికఁ గావఁగఁ జాలునొకో, దరిద్రనా
రాయణు డాతడేగ భువి యార్తిభరంబునఁ గ్రుంగిపోవదే !

తన హిందూమత ముద్ధరించుకొను యత్నంబందు నాటంక మ
య్యెనటంచున్ మది నెంచి మూఢమతియై హీనాతిహీనంబుఁగా
మన హిందూమతసారరూపు నిటుదుర్మార్గంబుతోఁ గూల్చెనే
మనవచ్చున్ "మతపిచ్చ" కుత్తుకలు కోయంజేయదే భ్రాతలన్.

చేతమునందు వాక్కునను చేతలయందున నన్య జీవి కే
రీతిగ నెంతమాత్ర మొనరింపడు హింసను నట్టి ధన్యుఁ జే
చేతుల జంపఁగా హృదయసీమ విరోధమదెట్లు కల్గెనో !
ధాతకృతంబు గన్గొనఁగ ధాత్రినిబోలునె యెంతవారికిన్.

కరుణరసంబు చిప్పిలఁగఁ గాంచి యనాథ జనాళిపైని ప్రే
మరసతరంగిణుల్ పరపి మానవలోకమునందు హీనులై
తిరిగెడి దిక్కులేని ప్రజఁదిన్నగ నున్నతి కెక్కఁ జేయునా
హరిజన బాంధవుండరిగె నయ్యయొ దిక్కెవరింకవారికిన్ ?

నిర్జీవజాతికి నేర్పుతో స్వాతంత్ర్య
మార్గంబుజూపిన మహితుఁడెవడు
పైశాచికత్వంబు పరిహరింపగఁ జేసి
మిత్రత్వమిచ్చిన మేటి యెవడు
త్యాగియై సర్వంబు బాగుగా దేశాన
కర్పించివైచిన అనఘుడెవడు
అర్థిక సాంఘికాద్యసమత్వములు పాప
సర్వయత్నమ్ములు సలిపె నెవడు

దయయు సత్యంబు మదియందుఁ దలచు నెవడు
సర్వమానవహృత్ పీఠసంస్థితుండు
అట్టి బాపుజీ దుఃఖమ్మునందు ముంచి
అరిగియున్నాడు దైవమా? అమరపురికి.

హంతయగు గాడ్సె తలపక
చింతాకంతైన జాలి చిత్తమునందున్
పంతంబున నినుగూల్చగ
వంతన్ పలవించె జనము వందితబాపూ!

పూజ్యంబగు భారతికి స్వ
రాజ్యము ప్రాపింపఁ జేసి బ్రహ్మాదుల కే
భోజ్యంబగు శ్రీహరి సా
యుజ్యంబును జేరినావ హెూ మహనీయా.



# బో సు వీ రు ( డు

అతడు మనుష్యు(డో భువి విహారము సల్పెడి నాకవాసియో ?
మతి నెఱుగంగరాదు; నవమంజుల పంకజదివ్యకాంతితో
జితయగు మేను; నిర్జర విశాంపతితో సరిపోలు శౌర్య మ
ద్భుత మగు రొచరీవి; సరిపో! మనవా(డె సుబాసుచంద్రు(డే !

త్యాగ వైరాగ్యముల్ స్థాపనం బొనరించి
    దేశీయభావంబు తెలిపినావు
విద్య, విజ్ఞానముల్ విపులమ్ముగా నేర్చి
    కాంగ్రె సధ్యక్షతన్ గ్రాలినావు
స్వాతంత్ర్య తేజంపు సంపాదనార్థమై
    మితి లేని కష్టాల మెల(గినావు
బ్రహ్మచర్యముతోడ పరిఢవిల్లుచు నుండి
    అతివీరు( డను ఖ్యాతి నందినావు

మేటి మేధావులందున సాటిలేని
ఖ్యాతి గడియించినా(డవో కర్మయోగి !
పూతభారతపుత్ర ! ఓ బోసువీర
దారి చూపింపుమా మాకు ధైర్యమూర్తి !

ఎవ్వాఁడు ధీరుడై ఏకాకిగా నేగి
పరరాజ గౌరవాల్ పడయగలిగె
ఎవ్వాఁడు చతురుఁడై 'ఏషియా' యంతట
స్వాతంత్ర్య బీజముల్ చల్లఁగలిగె
ఎవ్వాఁడు తగ 'అజాద్ హిందుఫౌజు'ను గూర్చి
పడి స్వతంత్రత గూర్ప నడుపఁగలిగె
ఎవ్వాఁడు తన్ను రాజ్యేందిర వరియింప
మూపులం ధరియించి మోయఁగలిగె

అట్టి దేశసేవాపరాయణు, అమేయ
శూరు, అలఘుతేజు సుబాసు నేరమెంచఁ
జాలు నెవ్వఁడు భరతదేశమ్మునందు
వాఁడెపో ! దేశవిద్రోహి వాస్తవముగ.

అంతటి వైభవోన్నతుల నంది నిరంతర దేశసేవ న
త్యంత సుకీర్తితో మని మహాత్ముల మన్నన లంది నట్టి బో
సంతటివాడు గూడ తుద కట్లు పఠానునివేషమూనెగా
అంతియ యొక్క వేళ ఘనుఁడైన చరింపగనౌ విరూపియై.



# నెహ్రూ పండితుఁడు

తన జాతి శ్రేయ మంతర్జాతి దృష్టితో
తిలకించ గలిగిన ధీచతురుఁడు
అఖిల ప్రపంచసమాఖ్య సైతము తొల్త
గౌరవ ప్రతిపత్తి గాంచు ఘనుఁడు
ప్రాక్పశ్చిమములందు పాలితప్రజలను
సంఘటింపఁగజాలు సాహసుండు
అధునాతన సనాతనాచార సారముల్
గ్రహియించుకొనిన సంస్కారరతుఁడు

పూర్వపర సంప్రదాయాల పోణిమి గని
నీతినియమాల చరియించు నేర్పుకాఁడు;
దశదిశావ్యాప్తయశుఁడు; విద్వన్నుతుండు
జహ్వారీలాలు భారత చక్రవర్తి.

అలుగుటయే ఎఱుంగ విసుమంతయు నెందఱొ చుట్టు మూగి ని-
చ్చలు విసిగింప; గర్వము నిజంబుగ తే దది, పల్కుచుందు వే
అలుపుని తోడనైన హృదయంబిడి; డంబ మనంగ నెట్టిదో
తెలియక సాధువై మెలగు దివ్యుఁడవే గద నెహ్రుపండితా!



# దేశభక్తులు

విరిసెను కాంగ్రెసు కొలఁకున
సరోజినీ, కమలములు ప్రశంసార్హములై
పఱపి ప్రచార సుగంధము
భరతక్షోణిని వికాసవంత మొనర్చెన్.

లలి జయభేరినే విజయలక్ష్మి విదేశములందుఁ జాటెగా,
అలయక మేలుకొల్పె రయితాంగము భారతిరంగ దీక్షతో
నిలిపె ప్రతిష్ఠనే అరుణ నిల్చి అగష్టు మహావిపద్దశన్
వెలయఁగ దేశసేవికలు విస్తృతకీర్తి గడించినారిటన్.

బలివెట్టెన్ జెఱయందు ప్రాణముల నబ్బా ! కస్తూరీమాతయే !
వెలయన్ సత్యవతమ్మ తా నసువులన్ వీడెన్ స్వరాజ్యమ్ముకై !
సలిపెన్ త్యాగము జీవదానమిది మజ్జా అన్నపూర్ణమ్మ తాన్
కలరే? దేశమునందు ఇట్టి వనితల్ కళ్యాణదీక్షాపరల్ !

పురుషవేషము బూని పోరి శాత్రవులతో
　　　　రాజ్య మేలె మును "సుల్తాను రజియ"
పురుషుని రీతిగా పోరాటమున నిల్చి
　　　　శత్రుబలము గూల్చె "చాందుబీబి"
పౌరుషంబున శత్రుపంక్తినే యెదిరించి
　　　　శౌర్యంబు జూపెను "ఝాన్సిరాణి"
ఆడువారలఁ గల్గు ఆంధ్రమహాశక్తి
　　　　రుచిని జూపించెను "రుద్రమాంబ"

యుగయుగమ్ములనుండియు మగువ లిచట
దేశ గౌరవమును గూర్ప ధీర లగుచు
సమరభూముల నిల్వరే? సాహసమున
అరయ నేఁటికిగూడ ముందడుగు నిడరె?

అమరఁగ దేశముల్ తిరిగి అచ్చటి విద్యల నేర్చి వచ్చియున్
మమత స్వలాభమే కనక మానితులై కడు త్యాగమూర్తులై
క్రమముగ విద్యయున్, ధనము, కాయము, సర్వము దేశసేవకై
సమముగ ధారవోసిన విశాలయశుల్ గద దేశసేవకుల్.

బిరుదులు వీడి, ఆర్జనలఁ బ్రీతి విసర్జనఁ జేసి, సౌఖ్యముల్
పరమ ముదంబునన్ వదలి, భారతభూమి స్వరాజ్యసిద్ధికై
పురుషత శాంతియుద్ధమున పోరి, శరీరము లాటిపోట్లకే
గురియొనరించి, జైళ్ళబడి, కోరి వరించిరి కష్టనష్టముల్.

పప్పుధప్పుళముకై పాఱు పాఱునిరీతి
ఉప్పుచేయఁగ ముందు కుఱికినారు
పప్పుబెల్లములపై వ్రాలు బాలునిరీతి
అల లాటిదెబ్బల కరిగినారు
పుట్టింటికిని వేగఁబోవు వధువురీతి
జైళ్ళకే నడువఁగా సాగినారు
రణరంగమున దూకు రాహుత్తుకైవడి
శిక్షలందుకొనంగఁ జేరినారు

శాంతిపథమును దప్పక సర్వవిధుల
తమ సుశౌర్య పరాక్రమ త్యాగ శీల
సమధికాటోపములఁ జూపి జయము గన్న
మన వలంటీరుల చరిత్ర! మఱవలేము.

గాంధిబాపుజీ యానతి కరముభక్తి
శిరములంబూని స్వాతంత్ర్యసిద్ధి కొఱకు
గాంధి టోపీని తలఁ దాల్చి కరమునందు
జెండగొని, దూకి రదె శాంతి భండనమున.

దీనుల నుద్ధరించుటకు దీక్షను బూని నిరంతరమ్ము న
జ్ఞాన తమంబు బాయుటకు జాతికి నూతన విద్య నిచ్చి దే
శాన దరిద్ర జీవులకు సాయము జేసిన వాఁడు ధన్యుఁడౌ
మానవసేవయే జగతి మాధవసేవ గదా! తలంపగా.

ఘనతరోద్యోగముల్ గడ్డిపోచనుబోలెఁ
దలఁచి యెందఱో కాలఁద్రన్నినారు
లక్షలాది గడించు లాయర్లు తమ వృత్తి
చిల్లిగవ్వఁగ విసర్జించినారు
కాసుకుం గొఱగాని కాలేజి చదువుల
విద్యార్థు లెందరో విడచినారు
ఫల మీయజాలవీ పాడు శాసనసభ
లంచు వాని బహిష్కరించినారు

విలువ గల విదేశీ వస్త్రములను బేర్చి
అగ్నిహోత్రున కర్పించి యలరినారు
త్యాగ వైరాగ్య భావముల్ దాల్చినారు
దేశభక్తులు తత్కథదివ్య మిలను.

బురదను బుట్టి పంకజము వొందదె కీర్తిని కాంతి సంపదన్
ఇరవుగ కాకిచిప్ప జనియించిన ముత్తెము మాననీయమౌ
తరువున బొల్చు చంపకము దాల్చును చల్లని కమ్మతెమ్మెరల్
వర గుణశాలియై వరలువానికి పుట్టుక నెంచ పాడియే.

పొనరిచినట్టి త్యాగములఁ బొందినయట్టి జయంబు నెంచి మీ
మనముల గర్వమూని పెడమార్గములం జరియింపబోకుఁ డో
వినుత యశస్కులార ! కనువిచ్చి కనుంగొను డెంత దూరమం
దున గలదో నిజమ్మయిన తొల్లిటి ఆర్థిక సౌష్ఠవం బికన్.

ఐర్లాండు స్వాతంత్ర్య మార్జింప "డివెలరా"
పడరాని బాధలు పడగలేదె ?
టర్కీని మేల్కొల్పుటకునై "కమాల్‌పాష"
ఎన్నెన్ని యిక్కట్ల నెనయలేదె ?
రష్యన్ మహాప్రజారాజ్యమ్ముకై "లెనిన్"
భూరి కష్టాలను పొందలేదె ?
ఇటలి జాతీయత నెనయు "గారీబాల్డి"
అధిక విపత్తుల నందలేదె ?

దేశదేశాల నెందఱో ధీరవరులు
జంకుగొంకు దొఱంగి స్వజాతి కొఱకు
ఘనతమీఱ ప్రజాస్వామికములఁ గూర్ప
ధారవోసిరిగద జీవితములనెల్ల.

అలఘుసత్త్వుండు శ్రీతిలకు, జీవితమెల్ల
కారాగృహంబుల గడపిపోయె
పంజాబు సింహమై పరగిన లజపతి
తనువు లాటీలకే ధారవోసె
ఘనుఁడౌచు నిండు జవ్వనము భగత్సింగు
ఉరికంబములకె తా నొప్పగించె
స్థిరచిత్తుఁడై మహాదీక్ష జతీన్‌దాసు
ప్రాణాలు జైలుకే బలియొసంగె

ఔర ! వీరాధివీరులు భారతాంబ
దాస్యశృంఖలలను త్రుంప తనువు ధనము
ధారవోసిరిగద ! వారి ధన్యజీవి
తములె మార్గదర్శకములై తనరుగాత !



# పట్టాభి

గాంధి వచించు ఋక్కులకు కమ్మని భాష్యములన్ రచింపగా
సంధి యొనర్చువేళ కడు చక్కని యుక్తుల మేళవింపగా
అంధిక బాప భారతమునంతట జ్ఞానసుధాంజనంబు నీ
యం, ధిషణాచమత్కృతి నహా! సముఁ డెవ్వఁడు భోగరాజుకున్.

అతఁడు మహారథుండు భరతావని దాస్య విమోచన క్రియో
ద్ధిత ఘన శాంతి సంగర విదీర్ణ విదేశ దురాగతుండు; సం
తత నిజ వాక్పటుత్వ సముదాయ వినిర్జిత శత్రుపక్షుఁ డం
చిత సుగుణ ప్రజాఢ్యుఁడు విశేష యశోవిభవాత్ముఁ డిమ్మహిన్.

అరదముపలు జయపురమున
సురవిభు విభవమునఁ జెలఁగి సురుచిర వాణీ
విరచనమున జయమును గనె
భరతవిభుఁడు తెనుఁగుజోదు పట్టాభి కడున్.

అతఁడు వేదిక నెక్కెనా? వాగ్ఝరీ రస
మ్మున సభాసదులను ముంచియెత్తు
అతఁడు వాదనఁ బూనెనా? ప్రతిపక్ష ప
క్షమ్ము నెల్లను జీల్చి వమ్ము సేయు
అతఁడు కలము పట్టెనా? సార నవరస
కావ్యసంపుటుల లోకముల నింపు
అతఁడు యోచనఁ జేసెనా? ఎంతవానిని
గూడ వింతగను లోఁగొనఁగఁగలుగు

అతఁడు కాంగ్రెసు విశ్వవిద్యాలయమ్ము
భాష్యకారుఁడు గాంధిజీ ప్రవచనముల
కచల దీక్షితుఁ డర్థశాస్త్రాభివేత్త
ఘనుఁడు పట్టాభి యాంధ్రుల కలిమి బలిమి.



# ప్రకాశము

ఆంధ్రకేసరినామ మన్వర్థమున్ జేసి
తెనుఁగు సీమకు పేరు తెచ్చినాఁడు
దేశదాస్యము మాన్ప ధీరతన్ బోరాడి
గాంధిజీ శిష్యుఁడై క్రాలినాఁడు
సర్వస్వమున్ దేశసౌభాగ్యమున్ గూర్ప
వెచ్చించి త్యాగియై వెలసినాఁడు
మంత్రియై మద్రాసు మాగాణమందున
తులలేని కీర్తితో నలరినాఁడు

ఆంధ్ర కాంగ్రెసధ్యక్షత నధివసించి
దివ్య గీతార్థసారమ్ము దెల్పినాఁడు
మాతృభూమికి దాస్యమున్ మాన్పి ప్రథిత
యశము బొందెను పూర్తిగా దిశల వఱకు.

లీలల్ మీఱ తెనుంగు చాతురిని ఢిల్లీనేతకున్ జూపె ము
న్నాలాయంబు స్వరాజ్య సిద్ధికయి ఏవా డట్టి యౌగంధర
శ్రీలాలిత్య కుశాగ్రబుద్ధి యొదవెన్ శ్రీకేసరౌ మంత్రికిం
కేలా చాలుదు రన్యు లీ ప్రతిభ సాటే లేరు ముమ్మాటికిన్.

# రంగా

ప్రొఫెసరుపీఠంబు పూతుఁడై విడనాడి
దేశీయసేవల దిద్దినాఁడు
పాశ్చాత్యదేశాల ప్రాభిమై విహరించి
గాంధేయ బోధలన్ గఱపినాఁడు
శ్రీకిసాన్ కాంగ్రెసున్ జెచ్చెరన్ నెలకొల్పి
జాతీయ ధర్మముల్ సలిపినాఁడు
సర్వస్వమున్ దేశసంసేవకై వీడి
త్యాగవైరాగ్యాలఁ దనరినాఁడు

తెనుఁగుగడ్డకు కీర్తిని దెచ్చినాఁడు
అఖిల భారతనేతగా అలరినాఁడు
రైతుబాంధవుఁ డాచార్య రంగబాబు
వినుత కాంగ్రెసు నేతయై వెలసినాఁడు.

కర్షక చాతకంబులు మొగంబులుపై కిడి రంగనాయకో
త్కర్షదవారిదంబును ముదమ్మువఁ గాంచి స్వతంత్రతా సుధా
వర్షముకోసమై కలరవమ్ము చెలంగగ వేచియుండె నా
కర్షకనేతకై జయము గల్గెడు గావుత! సర్వకాలమున్.



# విశ్వదాత

కలరు మహామనీషులు ప్రకాశిత తేజులు నాయకాగ్రగ
ణ్యులు మనయాంధ్రభూమినిమహోన్నతదివ్యయశఃప్రపూరితుల్
పలువురు; వారిలో మిగుల భాసిలుచుండును గాశినాథ స
త్కులజుఁడు తెల్గుజాతి కొఱకున్ శ్రమియించుచు నెల్లవేళలన్.

పత్రిక నిచ్చి యాంధ్రులకు భారతినే నెలకొల్పి కీర్తి యి
ద్ధాత్రిని పాదుకొల్పి ప్రమదం బొనగూర్పగ గ్రంథమాల నీ
క్షేత్రమునందున న్నిలిపి సేవయొనర్చె తెనుంగు బాసకున్
మిత్రము గాగ నిల్చి; తరమే కొనియాడగ నిమ్మహాశయున్?

దేశం బాతఁడతండు దేశముగ నెంతేనిం బ్రమోదంబుతో
తేశంబైన గొఱంత తేక కవు లుల్లేఖింప స్వాతంత్ర్య సం
దేశంబున్ వెదజల్లినట్టి ఘను నుద్దేశించి లోకంబు శ్రీ
దేశోద్ధారకు డంట యొప్పిదము గాదే యౌర నాగేశ్వరున్.

అతఁడు వదాన్యుఁడా(శ్రిత మహాజనకల్ప మహీరుహమ్మహో
వితరణ యన్న నాతనికి వెన్నను బెట్టిన విద్యయే సుమీ
యతులము దానశీలము సహాయము లే దను మాట లేక శా
శ్వతమగు కీరితిం గనియె సజ్జనమాన్యుఁడు విశ్వదాతయై.

దివిజుల్ సమ్మద పూర్ణచిత్తులయి యెంతే ప్రేమతోఁ బంపఁగా
దివిషల్లోకముఁ జేరఁబోయితివె! దేదీప్యంబుగా నొప్పు నొ
క్క విమానంబున నెక్కి, యింక నచటన్ గావించు దానంబులన్
దివిజాధీశుఁడె కాంచి వింతపడుగాదే దేవ! నాగేశ్వరా!



# వీరేశలింగము

ఇంటను వాకిట న్సతము నేది యొనర్చినఁ గాని ధీరుఁడై
యుంటయుఁ బైని సంఘమున నున్న దురాగతముల్ పెకల్చి య
న్నింటిని రూపుమాపుటకు నెంతయు సంస్కరణంబు సేయఁగా
వెంటనె పూనుకొంటయు నివే కద వీరుఁడు మెచ్చు ధర్మముల్.

బాలకు మనఃప్రవృత్తి దర్పణము వోలె
నెదుటివస్తువు కాకర్షణీయ మగును;
కాన సద్వస్తుజాలమే కంటియెదుటఁ
గానిపింపంగఁ జేయఁగాఁ బూనవలయు.

అన్నెము పున్నెమే మెఱుఁగనట్టి నిసుంగుల నేర్చి కూర్చి ప్రే
మ న్నిజపుత్రపుత్రికల మంగళసూత్రపు బంధనమ్ము తా
ము న్నయనాలపండువుగ మోదమెసంగఁగఁ గంద్రుగాని యా
పిన్నల భావిభాగ్యమును వీసమునేని తలంపరేమొకో!



# కోడి రామమూర్తి

కనుగొన త్రేత ద్వాపర యుగమ్ములనుండిన భారతీయు లె
ల్లను గడు దీర్ఘకాయులు కళావిదులున్ ఘనబాహు విక్రముల్
జననుత వీర్యులున్ సమద శత్రు భయంకరులై రహించి రా
మనుజులతోడ శౌర్యమున మాద్రి యగున్ గలిఁ గోడిరాముడే.

వెలయగ శౌర్యసంపదల విస్తృత కీర్తి గడించి మించి ని
స్తులమగు బాహువిక్రమముతోడఁ బ్రకాశమునొందె నెవ్వఁ డా
కలియుగ భీమసేనుఁ గనెగా మన యాంధ్రపురంధ్రి మున్ను దా
సలిపిన పుణ్యహేతువున సామ్యము గ్గలునె విశ్వమంతటన్,

తొలి దుష్యంతుని పట్టియౌ భరతుఁ డేదో యాటగా గహ్వరం
బులలో సింగపుఁ బిల్లలం బయటికిన్ రా నీడ్చె నౌరౌర ! యీ
కలిలోనన్ మన రామమూర్తి యటులే గంభీరుడై విస్మయా
త్ములుగాఁగా జనులెల్ల చిత్రపులి తోడ్తోరా, చరించెంగదా.



# అన్నపూర్ణాదేవి

జానైన వలిపెముల్ గాని కట్టగలేని
యింతి ఖద్దరు ధరియింపఁ గలిగె
పొరుగిండ్లకైనను బోవ నోడెడు లేమ
గ్రామసీమల తిరుగంగఁ గలిగె
ఆత్మబంధువులతోనైన పల్కఁగ జంకు
నువిద యుపన్యాస మొసఁగఁ గలిగె
తల్లిదండ్రుల యాజ్ఞ తలఁగనేరని బాల
ప్రభువుల యాజ్ఞ మీరంగఁ గలిగె

పౌర నిజమాతృ దేశవిస్తార పార
తంత్ర్య శృంఖలాచ్ఛేదనోద్యమ మహా ప్ర
చండ శాంతి సమర మహీస్థల విభాసి
తాత్మ శక్తి ప్రపూర్ణ మా యన్నపూర్ణ.

అవని జనించుటల్ లయము నందుట లెల్లర కున్నవేగదా !
భువిని జనించి కీరితి నభోమణియందున వెల్గులీన దై
వవిధి నొనర్చి వెన్కఁ నిరువంకల వారికి వన్నెఁదెచ్చెనో
యెవరిత యా సుశీలగద యిద్ధచరిత్రయు నన్నపూర్ణయున్.



# రాజేంద్రబాబు

సేవయె పరమావధి; ఇం
కేవియు రుచియింపనేర వెటులైన ప్రజా
సేవయొనర్చుటె విధి యను
భావము రాజేంద్రబాబు పావన మతికిన్.

ఒకయెడ మంత్రి యౌచు భరతోర్విని పాలనసేయనేర్చు; వే
రొకయెడ దుర్నిరీక్ష్యుఁడయి యొప్పును కాంగ్రెసు గద్దెపైని నిం
కొకయెడ మూర్తిమంతుఁడయియోర్పు మెయింబరిషత్కలాపముం
బ్రకటమతిన్ రచించు ప్రతిభంగని రాజనుబాబు మించెదున్.

గాంధీతత్త్వము పూర్తిగా నలవడంగాఁ జేసికొన్నట్టి ధీ
రుం ధీమంతుని గాన మింకొకని నేర్పున్మీర రాజేంద్ర బా
బుం ధర్మాత్మునిఁగాక ఏమిటికి నా పూజ్యుండె దిక్కయ్యె నీ
యంధత్వమ్మును బాపగా మనకు నార్యావర్త మందియ్యెడన్.



# సరోజినీదేవి

భారతారామ విలసిత భద్రసరసి
వికసిత సహస్ర పత్త్ర సద్విమల సరసి
జాత సురభిళ సుమసమ సకల సుజన
రుచిర సుఖదంబ మాదు సరోజమాంబ !

భారత దాస్య శృంఖలలు వాపఁగ గాంధిజి పిల్చినంతనే
ధీరత నిల్చి యేయబల దీటుగ వాహిని నగ్రనాయకో
దారుల శ్రేణియందు బలదర్పమెలర్ప స్వరాజ్యసిద్ధికై
పోరొనరించి కీర్తిని బొందె సరోజినిదేవి యాపెయే.

చక్కని గుణముల కిల్లయి
చిక్కని కవితారసంబుఁ జిలుకుచు భువి పెం
పెక్కిన మాత సరోజిని
నిక్కము మన భరతధారుణీలక్ష్మి గదా.



# వల్లభాయి పటేలు

ఎవని పేర్విన్నమాత్రాన హీనమతుల
కెల్ల గుండెలో గాలమై యెసఁగి ప్రక్క
బల్లెమగునో? యెవఁడు పరిపంథికుల వి
దళన దక్షుఁడౌ నతఁడె గదా పటేలు.

ఎరుగఁడు తంత్రజాలముల, నేర్పడనిల్చిన కార్యరంగ మం
దరుదుగదా సమాన మహిమాన్వితుఁడీ భరతోర్వియందు కా
దరయఁ బ్రపంచమందునను;హాస్యములుం బులిబుచ్చికంబులుం
మెఱుగుల పూతలుంసలుపమెచ్చఁడుముక్కుకుసూటిగాఁజనుణ్.

అదరఁడు బెదరఁడు తొలకఁడు
వదలఁడు తనపట్టినట్టి పట్టును నొకటన్
మద మడఁచును నెదిరిన తఱి
వదలఁడు నోర్మూయుదాఁక వదరుంబోతున్.



# అబ్దుల్ గఫూర్ ఖాన్

దయకాస్థానము, ప్రేమకా నెలవు, సత్యస్ఫూర్తికా పట్టు కొ
మ్మయ, దీనాశ్రితులందు జాలి, బుధసన్మానంబునా భక్తి శాం
తి యహింసల్ తనరారు ప్రోవనెడి ఖ్యాతిన్ జెంది, అబ్దుల్ గఫూర్
*త్రయమున్ గోరుచు వెల్గెడున్ "ఖుదయిఖిద్మత్గారు" సేవించుచున్.



* (1) సామ్యవాదము (2) శాంతి (3) అభ్యుదయము.

# మౌలానా అబుల్ కలాం ఆజాదు

సాహసౌదార్య విస్తార ధీచతురత
ధరణిలో నీకు బేబరె సముండు
ధర్మమార్గానువర్తనమునందున నీకు
అల హుమాయూనె తాఁ గలడు సాటి
పరమత సహనమ్ము పాటించుటను నీకు
వేయేల అక్బరే వెలయు సాటి
న్యాయవిచక్షణ జ్ఞానశోభను నీకు
నొప్పు జహంగీరె యొకఁడు సాటి

సాటియే లేడు స్వమత విజ్ఞానమందు
సాటియే లేదు స్వాతంత్ర్య సమరదీక్ష
నౌర ! కాంగ్రెసు గద్దెపై నలరినావు
ఆఱుసంవత్సరాల్ నీవు అజదుమౌల్వి !



# సామ్యవాదము

శ్రీ వీరజైప్రకాశ్ చెలగి నడుపుచుండ
స్వాతంత్ర్యమార్గాన సాగు నెద్ది
కమలమ్మ దీక్షతో కామ్యార్థసిద్ధికై
నవ్యబోధలొసంగ నడుచు నెద్ది
అచ్యుత పట్వర్ధ నతిసమర్థతఁ జూప
నలఘు తేజంబుతో నలరు నెద్ది
ధీరుఁడా లోహియా తీర్చి దిద్దుచునుండ
నతివేగమున ముందు కరుగు నెద్ది

అఖిల యువభారతుల కేది హర్ష మొసఁగు
పూజ్య వినొబా జవహరుల్ బోధ లిచ్చు
గురువులై మార్గమున్ జూప పరఁగు నెద్ది
అట్టి సోషలిజంబె దిగ్వ్యాప్తమగును.

ఏరాజ్యమందున నెట్టి దోపిడి విధా
నము లేక పేదఱికము నశించు
ఏరాజ్యమందున నెనలేని ఐహిక
నైతిక శక్తులు ఖ్యాతిమీఱు
ఏరాజ్యమందున నెల్లవస్తూత్పత్తి
సాధనల్ ప్రజలందు స్థగితమౌను
ఏరాజ్యమందున నెల్లర కొకటిగా
విద్యావినోదముల్ వెలయుచుండు

ఏమహారాజ్యమందున నెసఁగుచుండు
జీవనోపాధి సమముగా జీవతతికి
నట్టి సామ్యవాదాశయా లలరుచుండు
ఘనసమాజపు చిత్రమ్ముగాంచు మిదియ,



# తెనుఁగుతల్లి

శ్రీకరము శుభాకరము లక్ష్మీకరమ్ము
భవ్యమౌనీంద్ర బహుపత్ర భాసితమ్ము
ఐన భారత నీరజమందు వెలుఁగు
అమల కళ్యాణలక్ష్మి మా ఆంధ్రలక్ష్మి !

కలిలోన దైవసాక్షాత్కారమందిన
రామదాసెప్పుడో రాముఁజేరె
సంగీతసాహిత్య చతురుఁడై వెలసిన
త్యాగయ్య సురపురి కేఁగె మున్నె
కనకాభిషేకంపు ఘనత గాంచిన కవి
సార్వభౌముఁడుగూడ సాఁగిపోయె
ఆంధ్రసామ్రాజ్యమ్ము ఖ్యాతిగానేలిన
రాయలపేరును రాళ్ళగలసె

ఆంధ్రరత్నమ్ము భువివీడి యరిగెనెపుడొ
విశ్వదాతయు మనలను వీడిచనియె
ననుచు వగచుచు నుంటివా యాంధ్రమాత !
కలరు నేఁడును పెక్కురు ఘనులు సుతులు.

ఇల గాంధిమౌనీంద్రు కెనయంగ కుడిభుజం
బనదగు పట్టాభిఁ గనిన తల్లి!
ప్రకట వాగ్గేయకారకుఁడైన వేంకట
స్వామినాయుని గన్న వనితమిన్న!
తెనుఁగు కవితకు నుత్తేజమ్ము నొసఁగిన
రామలింగారెడ్డి రాజమాత!
ఆంధ్రభాషాపోషణాసక్తుఁడైన వి
క్రమవర్మ వెలసిన కనకగర్భ!

తత్వవేత్త రాధాకృష్ణతనయుమాత!
ఆంధ్రకేసరి నిలను గన్నట్టి జనని!
వీరరంగాజినే గన్న వీరవనిత!
తేజరిల్లుమ ధాత్రిలో తెలుఁగుతల్లి!



# పంజాబుహత్యలు

గర్భిణీస్త్రీలను కనికరంబునుమాని
చిత్రవధను జేసి చీల్చినారు
పసిబిడ్డలనుగూడ పలురకంబులుగాను
ముక్కముక్కలు చేసి మురిసినారు
అంధ వృద్ధాదుల నంగవిహీనుల
జంతుసంతతివోలె చంపినారు
లాఠీలు కత్తులు నీటుగాఁ ద్రిప్పుచు
గుండ్ల బారులుగూడ గుప్పినారు

చుట్టు గోడల మధ్యను జుట్టివైచి
నదుల పగిదిని రక్తంబు నడిపినారు
అకట ! దయ్యాలు మూకల యాగడములు
మఱవగాలేరు మహిలోన మనుజులెవరు.



# నిర్మాణకార్యక్రమము

ఖాదీ పరిశ్రమ న్గావింప వలయును
మద్యపానమ్మును మాన్పవలెను
హిందు ముస్లిముల కింపొందఁజేయుము మైత్రి
అంటరానితనమ్ము మంటగలుపు
మహిళామణుల హక్కు మన్నింపఁగావలె
ఆరోగ్యబోధఁ జేయంగవలెను
గ్రామ పరిశ్రమ ల్గడు వృద్ధిగావింపు
పారిశుధ్యమునకుఁ బాటుపడుము

వృత్తివిద్య, వయోజనవిద్య, గఱపు
మమతనేర్పు హిందూస్థాని, మాతృభాష
విడకు, మార్థికసమత గావింపవలయు,
కుష్ఠురోగుల నిలయముల్ కూర్పవలయు.

రైతు, కార్మిక కాంగ్రెసుల్ రంజిలగను,
అడవిజాతుల బాగుకై పడుము పాటు,
పూని విద్యార్థికాంగ్రెసున్ పూన్పవలయు
ఇవియ గాంధిసూత్రములంచు నెఱుఁగవలయు. (18)



ఖద్దరె ప్రాముఖ్యం బగు
ఖద్దరునే వ్రతముగాఁ గట్టగవలయున్
ఖద్దరు వ్యాప్తిం బొందిన
రద్దగుఁ బరతంత్ర దశ నిరాశ్రయమగుచున్.

ఈ రాట్నమే సుమీ ! యిహపరమ్ముల రెంటి
సాధింపఁగాఁజాలు సాధనంబు
ఈ రాట్నమే సుమీ ! ఋజుమార్గసంచారి
శాంతికాములకెల్ల సత్పథంబు
ఈ రాట్నమే సుమీ ! భారత స్వాతంత్ర్య
దీక్షా విహారుల మోక్షదంబు
ఈ రాట్నమే సుమీ ! హింసాపరుల దుర్భ
రార్భాటము లడంచు నాయుధంబు

ఇట్టిరాట్నమె సుమి ! భూమి నెల్లయెడల
శాంతి సందేశములనంపు తంతియగును
ఇట్టి రాట్నమె సుమి ! ఘోరహింసఁబాపఁ
దగిన వేల్పని నుడువంగఁ దగినదౌర !

ధనమాకూడును, దాస్యమాయుడుగు, స్వాతంత్ర్యంబచేకూరెడిన్
ఘనతాకల్గును, కామమాతఱుగు, సౌఖ్యంబాకడున్ వృద్ధియౌ,
వినయంబా జనియించు, ధైర్యరమయా పెంపొందు నింపొందగన్
మన మాధ్యాత్మికచింతలోఁ దవిలిరాట్నంబున్ సదాత్రిప్పినన్.



ఇల్లు గుల్లగఁ జేసి ఒళ్ళు కైపెక్కించు
మద్యపానంబును మానుడయ్యా
ఆయురారోగ్యముల్ హరియింపఁ జేసెడి
మద్యపానంబును మానుడయ్యా
సుజ్ఞానవిద్యల సూనృతమ్మును మాన్పు
మద్యపానంబును మానుడయ్యా
పేరుప్రఖ్యాతులన్ ఊరూర చెడఁజాటు
మద్యపానంబును మానుడయ్యా

ధనము నశియింప నిందలు తలకునెక్క
భార్యపిల్లలు కూటికి బాధఁజెంద
కల్లుద్రావంగ మనసెట్లు కలిగె మీకు?
మంచికార్యంబు కాదిది మానుడయ్యా.



హిందు ముస్లిములెల్ల పొందుగా భువిలోన
నొకతల్లి గర్భాన నుదయమైరి
అగ్బర్ కబీరులు నధిక యత్నముఁ జేసి
భ్రాతృభావము గూర్పఁ బడిరి పాటు
అన్నదమ్ములుమీర లన్యోన్యమున్ గూడి
స్వాతంత్ర్య యత్నమున్ సలుపుడయ్య
విశ్వకళ్యాణమె శాశ్వతమ్ముగ నొప్పు
పరమ ధర్మమ్ముగా పరగునయ్య

కూడియుండుట కడులెస్స గోడులేక
ఇంటికలహమ్ము హానినే ఎపుడు దెచ్చు
మదిని భ్రాతృత నెలకొల్పి మాతృజగతి
బానిసతనమ్ము బాపుడో భవ్యులార !

హిందూ ముస్లిము సఖ్యము
నెందును పాటింపవలయు హిందూదేశం
బందున; జాతీయైక్యముఁ
బొందక స్వాతంత్ర్యలక్ష్మి పొందదు మనలన్.

విశ్వమానవ సోదర ప్రేమ వెలయ
పూర్ణ విశ్వాసమును బూని భూమి మీఁద
మాటమంచియు గల్గిన మానవులకు
హామి యింకేమి గావలెనయ్యా? చెపుమ !

ప్రత్యేకజాతులు ప్రబలిన రష్యలో
ఐక్యప్రభుత్వమే అలరుచుండె
ప్రత్యేకరాష్ట్రాల వరలెడి అమెరికా
సంయుక్తరాష్ట్రమై జగతి వెలసె
బహుమతాచారాల వరలు అరేబియా
ఏకరాజ్యంబుగా నెసగుచుండె
వివిధ మతమ్ములు వెలసిన ఈజిప్టు
ఒక్క రాజ్యంబుగా నొప్పుచుండె

అరయ నేఁటి ప్రపంచమ్మునందు నెచట
మతము పేరిట రాజ్యాలు మనుటలేదు
మతము వేరైన మారునా మానవత్వ
మది తలంచుము సోదరా ! ఐక్యమగును.

మతమును మార్చుకొం డనుచు మారక యుండినవారి నెల్లరన్
చితుకగ గొట్టి యింట నిడి చిచ్చునుబెట్టి కులాంగనావళిన్
వెః చెరబట్టి వేవిధుల భీతిలగొట్టగ నేగి రంతటన్
బ్రతికిన బల్సుకూర తినవచ్చునుచున్ నవఖాలి ఖాలిగాన్.

8

నడచువా రటులనే నడచుచుండగ తలల్
ధరణిఁ గూలిన కళేబరము లొకట
కూర్చున్నవారలు కూర్చున్నయటులనే
చలిమిడి ముద్దలౌ శవము లొకట
పండుకొనినవారు పండుకొన్నట్లె తుం
డెంబులై యున్న మొండెంబులొకట
నిలుచున్నవారలు నిలుచున్నయటులనే
లొంగి దొరలెడు పీనుంగులొకట

ఎట్టులున్నవార లట్టులే గిట్టిరి
కఱకు దుండగీండ్ల కత్తిపోట్ల
పాఱె నెత్రుటేళ్లు బాపురే! భారత
నగరవీథులందు నాఁడు భాయి!

ఇల్లును వాకిలిం గలిగి యెందును పెంపు వహించి వృద్ధిగాఁ
బిల్లలు జెల్లలుం గలిగి ప్రీతిమెయిం విహరించువార లీ
ప్రల్లదము ల్వొనర్చుదురె! బాధ్యతలేని బికార్లుగాక నే
డెల్లెడ క్రూరకర్ములు వహింపరు బాధ్యత నీచబుద్ధులై.

కుడువ కూడును కట్టగా గుడ్డ యిల్లు
అన్ని మతములవారికి నవసరంబె
మతము వేరైన కష్టాలు మార వెందు
కాన స్వాతంత్ర్యమును బొందఁ గదలి రండు.



అంటరానితనము కంటకభూజమ్ము
పెరకవలయు దాని వ్రేళ్ళతోడ
దాని బాపకున్న ధర్మమ్ము నశియించు
రాదు రాజ్యలక్ష్మి రాదు మనకు.

ధర్మము ధర్మ మంచును సదా వచియింతురు ధర్మపన్నముల్
ధర్మమునందు లేదె దయ? దగ్గఱఁ జేరగ ఛీ యటంచు పో
దుర్మతి దూర మంచు బహు దూషణచేయుచు ధర్మ మౌనొకో
మర్మ మికేలయయ్య దయమాలిన ధర్మము లున్నవే భువిన్.

చెప్పగరానివారు దరిఁ జేరఁగరానియువా రటంచు మీ
గొప్పతనమ్మునే తలఁచి క్రూరముగా గనుచుందు రయ్యయో
తిప్పలు బెట్టగా నెటుల దీనుల భాగ్యవిహీనుల న్మనం
బొప్పెడి? జాతిగుండి యయొ? ఓర్వగలారె సహోదరవ్యథల్?



# కష్టజీవి

ఎండవానల కోర్చి ఏడాది పొడవున
చెమటోడ్చి సేద్యమ్ము చేయుచుండు
భూమాతనే నమ్మి ప్రొద్దుగ్రుంకెడిదాఁక
మట్టిలో పొర్లాడి మాడుచుండు
ఇల్లు వాకిలి వీడి ఎల్ల వేళలయందు
పసులకొట్టాలలో పండియుండు
మెఱుగన్న మెట్టిదో మెసవుటే ఎఱుఁగక
గొడ్డుఁగారపుకూడె కుడుచుచుండు

శ్రమకు ఫలితమ్ముగా ధాన్యరాశి రాఁగ
దాని భూస్వామికిని ఋణదాత కొసఁగి
శిస్తుకట్టంగ పెండ్లాము పుస్తె మిగుల
బ్రతికియున్నాఁడు రైతు జీవచ్ఛవముగ.

చాలున్ జాలును సేవజేయు టిఁక పైఁ జాలింపుమా సాహులా
హా! లాభంబులఁ జూచుకోక మన చాయన్ గందురా? భ్రాంతిగా
నీ! లే రమ్మిక వీరి యాట లిటుపై నేలాగు సాగింతురో
కాలంబిట్టులెయుండఁబోదు "రయితాంగంబే" విజృంభించినన్.

బహువిధ ధాన్యాలు పండించునేకాని
కడుపు నింపుకొనంగ గంజినీళ్ళె
చీనిచీనాంబరాల్ సృష్టించునేకాని
చెల్లఁబోకట్టఁగా చింపిపాఁతె
పనితనంబున సౌధపంక్తి కూర్చునెకాని
ఔరౌర! నివసింప పూరిగుడిసె
పట్టుబాలీసుల పాన్పమర్చునెకాని
అక్కటా పడియుండ కుక్కిపడకె

భోగ్యవస్తు వితతి పూనిచేయునెకాని
కట్ట! అనుభవించు కష్టములనె
కష్టపడుటెగాని గైకోడు ఫలితమ్ము
కర్మయోగి తలఁప కార్మికుండు.

దొంగ యెవండొ యింటఁ బడి దోచుచునుండగ కన్నులారయే
వెంగలిచూచి కర్మ యని వేగిర మొందకయుండు చెప్పుమా?
సంగరభూమిఁ దన్నెదిరి శాత్రవవీరుఁడు కత్తిదూయఁగా
లొంగు నెవండు కర్మ యని? లోఁగొనఁ జూడక వైరివీరులన్.



కనికరం బిసుమంత గాంచక రైతు ర
క్తమును బిండెడి జమీందారు లొకట
దుర్మదాంధత మీరి తోడిమానవుల జీ
వనములఁ జీల్చు భూస్వామి లొకట
పేరాశ వడ్డీలఁ బెంచి పేదల యాలి
త్రాడుఁ దెంచెడి ఋణదాత లొకట
కడకు చెప్పులుగూడ కాళ్ళఁదొడగ నన్య
పురుషుఁ గోరెడి పుట్టుభోగు లొకట

చాటి తెల్పుచుండె సామ్రాజ్యతత్వంబు
పాదుకొనె నటంచు భరతభూమి
నింకనైనను మన మేకమై యద్దాని
పారద్రోలకున్న బ్రతుకుగలదె?

**ఔరా! ఎంతటి క్రూరచిత్తు లిసిరో! అన్యాయముల్ సేయగా
ప్రారంభింతురు స్వార్థకాములయి దుర్మార్గంబులన్ జేతురే
నేరంబైన నొనర్ప శంకిలరు దుర్నీతిన్ జమీందారు ల
వ్వారల్ సేయని దౌష్ట్యముల్ గలవె? వహ్వా! క్రూరులై భారతిన్.**

**నశియింపన్ వలెనయ్య బూర్జువవిధానం బింక నీ దేశ మం
దు శమింపన్వలె నీ ధనాఢ్యుల దురుద్యోగాత్మ సంకల్పముల్
కృశియింపన్వలె రాజ్యపాలన మహాతృష్ణాత్ము లీ యుర్వి స
ద్వశమున్ బొంది ప్రజాప్రభుత్వములె యత్యంతమ్ము శోభిల్లగాన్.**

భాగ్యవంతుని ముక్కున పడిసెమైన
ప్రకటితం బౌనుపో గొప్ప వార్త యటుల
శ్రామికులు రోగములఁ జిక్కి చచ్చుచున్న
ననుకొనెడివాడె యుండఁ డీ యవనిమీఁద

ధనికుఁడు శ్రామికజీవుల
తను రక్తము పీల్చి జీవితమ్మును గడపున్
కనఁ జిన్ని చేపలం దిని
ఘనమీనము బ్రతుకునట్లుగా నీ ధరలో.

అనదలై కూటికి నలమటించెడికూలి
జనుల సాధించు దుర్జనుడు గలడె
కొంప గోడియు లేక గుడిసెల వసియించు
బీదల నేఁచు పాపియును గలడె
చదువ నేర్వఁగలేక చాల నజ్ఞానులౌ
మూఢులన్ జంపెడి మొఱకు గలడె
తమ పిల్లజెల్లతో తా మెట్లొ జీవించు
కష్టజీవులఁ గూల్చు ఖలుడు గలడె
అట్టి పాపిష్ఠజీవనుం డధముఁ డైన
దుష్టు లందఱలోన నికృష్టుడైన
పరమ దుర్మార్గు డైన ముష్కర నిశాటు
ధూర్తమానవు బంధించి తునుమవలదె ?



# విద్యార్థి యువకుడు

అల గాంధిజీ యసహాయోద్యమంబున
పాఠశాలల వీడి వచ్చి రెవరు?
సైమను సప్తక సంఘుంబు కెదురుగా
నల్లజెండాలతో నడచి రెవరు?
లవణ సత్యాగ్రహోల్లాసంబుతో మన్ను
మిన్నేకమౌరీతి మెలగి రెవరు?
ఆగస్టువిప్లవంబందు నసువు లొడ్డి
జాతీయతను నిల్పంజాలి రెవరు?

అఖిల జాతీయ సమరంబు లందు నెందు
ఘనతరోజ్జ్వల ప్రతిభా వికాస మొప్ప
ముందు కురికిన యువవీరమూర్తు లెవరు?
అఖిల భారతదేశ విద్యార్థులె గద !

బుగబుగ యంచు యౌవనము పొంగుల రక్తము చిందివారగా
నగణిత పౌరుషంబున విహారముసల్పుచు మాతృభూమి నీ
జగమున సర్వసంపదల సౌష్ఠవవంత మొనర్పనెంచి మే
లగునటు లెల్ల యుద్యమములందున నిల్చినవాడ వీవెగా.

వెఱపన్నట్టిది లేదు లేశ మయినన్ విద్యార్థి ! నీ కీ భువిన్
కలువేలేదు విశాల ధైర్యమునకున్ కామ్యార్థసంప్రాప్తికై
మురిపం బొప్ప స్వరాజ్యసిద్ధికొరకై ముందే చనంజాలు నీ
సరియెవ్వారలు? భావిపౌరుడ ! సుధీశాలీ ! యువాగ్రేసరా!

స్పర్శనాశ్లీలహాసమ్ములన్ విడనాడి
విద్యావిభూతిచే వెలయుమయ్యా
దోషావకాశమ్ము దూరమ్ముగావించి
సౌశీల్య దోషముల్ చాటుమయ్యా
సంభాషణారోగ్య జాతీయ కవితల
సద్గ్రంథ మిత్రుల సాకుమయ్యా
ధ్రువ వివేకానంద జవహరు బోసుల
జీవితాదర్శమ్ము చేరుమయ్యా

సమయ వీర్యగాంభీర్యాది సద్గుణాళి
మాన్య శపథ సుదృష్టుల మఱవకయ్యా
ఆత్మవాణి నియమముల నరయుమయ్యా
నవ్య భారత విద్యార్థి! భవ్యచరిత!

ఆయు రారోగ్యముల్ పొంది యధికముగను
విశ్వ విజ్ఞాన సేవల వినుతిఁ గాంచి
యశముఁ బొందుము పూర్తిగా దిశల వఱకు
సామ్యవాద ప్రచారక సరళహృదయ!

ఆంగ్లభాషను పాండిత్య మబ్బబోదు
మాతృభాషయు మొదటనే మరుగువడియె
నేఁటి విద్యార్థులకు రెంట నేర్పులేదు
రెంటికిని చెడిపోయిన రేవడ వలె.



# స్వాతంత్ర్యము

ఆంగ్ల సామ్రాజ్య మూలాధారమగు జమీం
దారి విధాన మంతంబునొందె
అజ్ఞాన తిమిర చిహ్నంబగు మద్యపా
నంబు సమూలమై నాశమొందె
ధనిక వాదంపుఁ దత్త్వస్థాయి యన నొప్పు
ఋణబాధ దేశమం దణగిపోయె
భరియింప మిక్కిలి భారంబులగు పెక్కు
క్రూరశాసనములు కూలిపోయె

పరమ దుర్మార్గ దుర్భరార్భాటచటుల
పటు మహా నట సామ్రాజ్యభార విషమ
ఘోరగంబు కృశించి రూపాఱుచుండె
మహిని స్వాతంత్ర్యగారుడ మంత్రమహిమ.

వెచ్చని వీరరక్తమును వెచ్చము పెట్టక ప్రాణవిత్తముల్
మెచ్చుగ ఖర్చు చేయక, అమేయ పరాక్రమ మెల్లఁ జూపుచున్
మచ్చరమూడ్చి తండ్రులను మాతల భ్రాతల పుత్ర మిత్రులన్
దెచ్చి ముదమ్ముతోడ బలి నీయక యబ్బునె స్వేచ్ఛ యేరికిన్?

సుస్థిర స్వాతంత్ర్య సుగమమార్గము నేర్ప
రచు ప్రజాపరిషత్తు రంజిలవలె
ఐక్య భారతఖండ మవతరింపగఁ జేయు
పరమత సహనంబు భాసిలవలె
పరిపూర్ణమౌ స్వేచ్ఛఁ బడయగల్గుట కాంగ్ల
సేన యీ దేశమున్ మానవలెను
శాంతి భద్రతలతో జయమంద జాతీయ
సేన దేశంబందు చెలగవలెను

ప్రీతి స్వాతంత్ర్య వాయువుల్ పీల్చుటకును
సామ్యవాదపు రాజ్యమే సాగవలయు
ఈ మహాలక్ష్య సంసిద్ధి యెంతదనుక
కలుగకుండునొ యందాక కలదె శాంతి?

రే! దివ్యాంధ్రుఁడ! జాలమేల యదిగో రేగెన్ మహావిప్లవం
బాదివ్యాగ్ని మహోరుకీల లవె బ్రహ్మాండంబులన్ జుట్టుచుం
వాదేలా ఎవ రడ్డమైననుసరే స్వాతంత్ర్య మార్గమ్మునన్
బూదింజేయుము వీరులై నిలువుడీ పూర్ణార్థ స్వామ్యమ్ముకై.

కష్టార్జితంబైన కమ్మని పంటను
తినగనోచని రైతు జనములార!
కాయకష్టమ్ముచేఁ గాంచెడి ఫలితమ్ము
ననుభవించని కూలిజనములార!
అతిసమ్మదమ్ముతో యౌవనోద్రేకాన
చనగజాలని యువజనములార!
సేవకవృత్తిలో జీవించుచు సతమ్ము
దిక్కుఁ గుంగని దేశదీనులార!

కనుడు మీరెల్ల రీ పతాకమ్ము నీడఁ
జేర రండు; స్వాతంత్ర్య మార్జింప రెండు
కలసికట్టుగ మీరెల్ల మెలఁగఁ గనుఁడు
శాంతి సౌఖ్యమ్ము లొంది దేశమ్ము వెలయ.



కంటిమి స్వేచ్ఛ నేఁటి కిదె కంటిమి భారతజాతి టెక్కె మిం
టింటను స్వేచ్ఛమై నెగుఱు, టింకను తొల్లిటి ఢిల్లి కోటపైఁ
గంటిమి జాతి చిహ్నము ప్రకాశముగాఁగఁ, బ్రపంచమందునన్
గంటిమి గౌరవమ్ము, జయగానమొనర్పుఁడు సంతసంబుతోన్.

తేరున టెక్కెమే భరత తేజమునిల్పఁ బ్రధానమయ్యె మున్
భారత వీరయుద్ధమున; ప్రస్తుత మీ మన రాజ్యమందు నీ
భారత జాతిజెండ ప్రతిభా పరిభాసిత దివ్యదీప్తి వి
స్ఫారక్ష్యయశస్సుఁ గైకొని ప్రచండ జయోన్నతి నందుగావుతన్.

ఎన్ని దినాలనాఁడొ కృశియించిన క్రుంకినయట్టి భారతా
భ్యున్నత రాజ్యభానుఁ డడుగో ! పొడుపున్ మల గోచరించుచుం
డె న్నిజతేజమొప్పఁ గనుఁడీ ! వినుడీ జయ జై నినాదముల్
మిన్నులు ముట్టుచున్నయవి మేలిమికాంతులు నిండె నెల్లెడన్.

ఇదియ ప్రభాత మయ్యెఁ; గనిపించెడి నియ్యది సుప్రభాతమే
మది నిఁక సంశయంబు విడి మాతృవిపత్తి విమోచనాశుభా
స్పద సమయమ్మునందు జయశంఖము లొత్తుఁడు; భారతీమహా
భ్యుదయ పరంపరల్ విని మహాత్మవలీలఁ జరించి మించగన్.

అరిగె స్వతంత్రతా సమరమందున నర్వదియేండ్లు, నేఁటి కీ
కరణి స్వరాజ్యము న్బడయఁ గంటిమి గాంధిమహాత్మునత్కృపన్
తరలిరి యెందఱో ఘను లుదారులు ధీరులు మేనువాసి దు
స్తరతర శాంతి సంగర విధానమునందు ప్రధానవీరులై.

కనుఁ డదె యభ్రవీథినిఁ బ్రకాశిత తేజులు దివ్యమూర్తు లీ
ఘనమగు సంబరంబు గనగాఁ జనుదెంచి ప్రమోదచిత్తులై
కనుగొనుచున్నవారు తమ కష్టఫలం బిది యిట్టిదంచు నా
ఘనులకు శాంతివీరులకుఁ గానుక సేయరయా! సుమాంజలుల్.

వెలసెను భారతీప్రతిభ విశ్వమునందున మున్నదెప్పుడో
బలసెను సర్వసంపదల భాసిలి భారతమాత యెన్నడో
మలసెను యన్యపాలనము మార్కొని భారతి వీరమాతయై
కలసెను స్వస్థచిత్తమును గాంచి ప్రపంచసమాఖ్య నేఁడిటన్.



# సైనికశిక్షణ

యువకులు స్వేచ్ఛను బ్రోవగ
జవమును జీవమ్ము గలుగ చయ్యన రక్తిన్
ప్రవిమల సైనిక శిక్షణ
మివులన్ నేర్వంగవలయు మేదినియందున్.

భారతభూమి సంజనిత భవ్య యశఃప్రతిబింబు లెప్పుడున్
భారముఁ బూని దేశ హిత పావన సేవలఁ జేయుచుండగన్
కారణజన్ముఁడౌ ఘనుడు గాంధిజి బంధములెల్ల బాప నీ
ధారణి రక్షసేయుటకు ధైర్యముతోడుత రమ్ము సోదరా.

అరి రాజ పమద వేదండ తండమ్ముల
శిక్షింప సైనిక శిక్షణంబు
పరపీడనాసక్త పాపిష్ఠ సంఘాల
శిక్షింప సైనిక శిక్షణంబు
పరమ విద్రోహ దుశ్చరితానుశీలుర
శిక్షింప సైనిక శిక్షణంబు
నీచ నియంతృత్వ నియమానుకూలుర
శిక్షింప సైనిక శిక్షణంబు

నవ నవోన్మేష మంజుల నవ్యసార
సురభిళ సులలిత వినూత్న సుందర విక
సిత భరత కుసుమంబు చేసేతఁ ద్రుంచు
చెనటి శిక్షింప సైనిక శిక్షణంబు.

సామ్రాజ్యవాద పిశాచంపు కనుచూపుఁ
బడనీక భారతి భద్రపఱుప
దౌర్జన్యవాద భూతాళి దంష్ట్రలయందుఁ
బడనీక భారతి భద్రపఱుప
ద్రవ్యోల్బణమ్మను దయ్యంపు పెనునోటఁ
బడనీక భారతి భద్రపఱుప
మత దురహంకార మత్త గ్రహకరాసిఁ
బడనీక భారతి భద్రపఱుప

ఘోర ద్వేషాగ్ని భీకర క్రూరచర్య
భ్రమసి పడనీక భారతి భద్రపఱుప
భారతావనిలో నెల్లవారు నేఁడె
చేరి పొందుడు సైనిక శిక్షణంబు.

వెనుకన్ దేశము పారతంత్ర్యమున నిర్వీర్యమ్ముగా మాఱె శాం
తిని గోల్పోయి; ఇదే స్వతంత్రతను నుత్తేజంబు నొందింపఁగా
ఘనమౌ సైనిక శిక్షణమ్ముఁ బడయంగా కర్జమౌ, మాటలం
గనునే? తొల్లిటిపేరు భారతి సుధీగణ్యమ్ముగా నిమ్మహిన్.

నవ్యభారత స్వాతంత్ర్య భవ్యరక్ష
నేఁటి విద్యార్థి యువకులు, నీతిబద్ధ
సైన్య శిక్షణ ప్రవిమల శక్తిచేత
చేయవలయునను దీక్షతో స్థిరముగాను.



# మా జాతీయ రచనలు

**1 కాంగ్రెసు విజయము** (చరిత్రాత్మకనాటకము) 1-0-0

డాక్టర్ పట్టాభివంటి ఆంధ్ర నాయకుల ప్రశంస లందినది.

"60 ఏండ్ల కాంగ్రెసు చరిత్రలోని ప్రధాన ఘట్టాలు-సంస్కరణాంకము, సంపూర్ణ స్వరాజ్యాంకము, ప్రజావిప్లవాంకములుగా చిత్రింపబడిన నాటక మిది. భారత స్వాతంత్ర్య సమర చరిత్రను ఈ విధంగా నాటకరూపంలో వ్రాయడానికి జరిగిన తొలిప్రయత్నమే కాదు. ఇది ఘనప్రయత్నం కూడా. ఈ రచయితలు ఇరువురు గొప్పపండితులు. దేశభక్తులు. వీరి రచన-శైలి-పద్యాలు-గేయాలు హృద్యంగా గంభీరంగా ఉన్నవి." —ఆంధ్రప్రభ

**2 ప్రజారాజ్యము** (సామ్యవాద నాటకము) పలుచోట్ల ప్రదర్శింపబడినది.
**3 ఉపాధ్యాయుడు** (ఏకపాత్ర నాటిక) } 1-0-0

"ప్రజారాజ్యం కలముతోటి గాక హృదయముతోటి రాసిన నాటకము. ప్రస్తుతం దేశానికి యిలాటి నాటకప్రదర్శనము లే కావలసినవి." —మాధవపెద్ది వెంకట్రామయ్య

"శ్రమజీవుల కడగండ్లు జమీందారుల దౌష్ట్యములు మొదలగు విషయాలుగలవు. సామ్యవాదసమాజాన్ని స్థాపించుటకు ప్రజలనెట్లుచైతన్యవంతులనుచేయాలోకూడ స్పష్టంగా పాత్రలముఖమున చెప్పబడినది. "కర్మా! కర్మ! ఈ కర్మఅను మాట ధనవంతులు ధనహీనులను దోచుకొనుటకు కల్పించిన పన్నాగము." —ఈ నాటకం చదువదగింది.

ప్రదర్శింపదగిందని మా యుద్దేశము—మాతృభూమి.

4. చలో ఢిల్లీ (బోసుపీరుని చరిత్ర – బుఱ్ఱకథ) 0–6–0

5. జయభేరి (జాతీయములగు ఖండకృతుల సంపుటి) 1–4–0
(ఉపన్యాసకులు, హరికథకులు, విద్యార్థియువకులు, దేశభక్తులు, కంఠస్థము చేయదగుపద్యములు. వ్యాప్తిలో నున్నవి.)

6. వైతాళిక కథలు
(జాతీయ నాయకుల జీవిత చరిత్రములు) 0–12–0

7. జాతీయ కథలు ... ... 0–12–0

8. ఆచార్య రంగా (జీవిత చరిత్ర) ... 0–12–0

9. జాతీయ దసరా గీతములు ... 0– 2–0

10. అనుభవ దర్పణము (గాంధీజీ కథలు) 0– 8–0

11. నరేంద్రుడు (వివేకానంద జీవితము) ... 1– 0–0

12. లీలావతి (నవల - ఆంధ్రచరిత్ర) ... 0–10–0

13. జయసుధ (సత్యాగ్రహముల చరిత్ర) 1– 0–0

14. వెన్నెల కుప్పలు (ఖండకృతి) ... 0– 8–0

15. ఖండకృతి (ఖండకావ్యసంపుటి) ... 1– 4–0

16. వ్యాసవాణి ... .... 0– 6–0

17. నవగీతాలు ... ... 0– 3–0

18. ఆంధ్ర సేవాకథలు (జీవితములు) ... 0–12–0

19. ఉత్తమ కథలు ... ... 0–12–0

20. వయోజన విద్య ... ... 0– 4–0

---

రచయితల పేట - చిలకలూరిపేట, గుంటూరుజిల్లా.